# రంగా

నిను దేశభక్తుఁగా మె
చ్చినవారలు కలరు మహి నశేషప్రజ; లీ
వొనరించిన భాషా సే
వ నెఱింగినవార లెన్నివందలు కలరో !

చక్రవర్తుల ముత్యాలశాలలందు
నగ్రహారాల నడిబొడ్డులందుఁ గులుకు
కవులు కనలేని తెలుఁగుచక్కందనమ్ము
చూఱలాడిన శారదాసుతుఁడ వీవు

పల్లెటూరఁ బుట్టి పల్లెల సేవించి
బీదవారి కులముపేదవారి
పలుకుగుట్టెఱింగి పసగల జాతీయ
రచనసేయు సుకవిరాజ వీవు

తెలుఁగునుడికారమందున్న మెలపు నెఱిఁగి
తెలుఁగుహృదయంబునందున్న తీపి నెఱిఁగి
తెలుఁగుసంస్కృతియందున్న చెలువ మెఱిఁగి
తెలుఁగునకు నీవు సరిక్రొత్తవెలుఁగు లిడితి

మోసులెత్తిన వేలుపుంబాసమీఁది
తగులమునఁజేసి తెల్గును దెగడువారు
వ్రాయుదురు గాక తెలుఁగుకావ్యమ్ము - లినుప
సుద్దులే కాని యవి లక్ష్యముద్ద లగునె

(౧౬-౩-౪౨)

అఖిలభారత కర్షకానీకములకన్ను
విప్పి వెల్గులుపంచు వేగుఁజుక్క
సకల కార్మికలోక సంతాపదావాగ్ని
చల్లార్చు నాషాఢజలదరేఖ
ఆంధ్రీచిరోపవా సావిర్భవత్తపః
క్రతుఫలంబైన బంగారుబిడ్డ
సతతప్రజాహిత వ్రతదీక్షలోఁ బండి
కమ్మతావులు చిమ్ము కర్మయోగి

తెలుఁగుఁదోఁటను మూఁడుపూవులకు నాఱు
కాయ లందింపఁ జాలిన గడుసుమాలి
రంగనిజయంతి నవ్యభారతముపాలి
మధురపర్వమ్ము హర్షసామ్రాజ్యరథము

రంగఁడు మావాఁడంచుఁ దె
లుంగులు మోహమ్ము పెంపులో నెంతురు, ధా
త్రింగల వారికి నెల్లను
రంగఁడె వేల్పని జగమ్ము రచ్చలఁ దేల్చెన్

కర్ణాటీ నవహీరహారము, త్రిలింగమ్మోసతీ మల్లికా
పూర్ణోద్యానము, ఘూర్జరీ ముఖకళాపుంజంబు, విశ్వక్షమా
స్వర్ణద్యుంబరచుంబివాఃపటలమై సభ్యప్రపంచమ్మునన్
వర్ణింపంబడు నీ యశంబు మృదుభావా! భారతీవల్లభా

ఒక భారతికిన్ నాథుఁడ
వొకభారతి కర్చకుండ; వొకనాఁటికి నం
దక పర్వులెత్తుచుట్టమ
వొకనాఁటికి లెంక; వెట్టివోయీ! లీలల్

ఈ నిఖిలావనిన్ జయ జయేతిరవమ్ముల నిండి నేఁడు నీ
జానుపవాస రోత్సవ మెసంగుచునున్నది యట్టె! యిట్టి స
మ్మానము లొక్క వేయి మఱిమాటకువచ్చిన రెండువేలు నీ
కౌను గదోయి! లోకమున కౌనుగదోయి! మహఃపరంపరల్

రాచఱికమ్ముసేయుటకు నైతొకఁడే తగునంచు, ధర్మముం
బ్రోచునతండ యంచు, మనప్రాజలు కొన్ననుసంచు కాయముం
ద్రోచుచుఁబల్కె గాంధి; ఋషితుల్యుఁడతండు మనమ్ములో నినుం
జూచియ చెప్పె నట్లనుట సూనృతమోయి! జగద్ధితాగ్రణీ!

రమణీయమ్ము లపూర్వసౌరభపరీరంభమ్ము లుత్ఫుల్లముల్
సుమముల్ దండలుగట్టి తెల్గురమ చూచున్ నిన్నుఁ గైసేయఁగన్
సుముహూర్తంబునుడాసె మాతృకనుశుశ్రూషింతువో హస్తినా
రమ నీవే సముపాసితవ్య వని యారాధింతొ మాతామహిన్

కన్నతల్లి నీదు కా ఖా ల వయసులో
నమరవతికి నేగినట్టికతనఁ
బేర్మి నించి నిన్నుఁ బెంచిన దమ్మమ్మ
యగుట నిట్టిశంక కగ్గపడెద

మనయోర్గల్లుబరంపురమ్ము తుముకూర్ మాగాణిచాందాలిఁకన్
దెనుఁగైపోవుటతప్పదోయి! విరివిన్ ధీసంపదన్ సంపదన్
జనసంఖ్యన్ మనకేలభించు భరతత్వమ్మె నగ్రతాంబూలాల; మీ
ఘనతన్ నిల్పుటకై యొడంబడుము రంగా! కొన్ని యేండ్లేనియున్

(౬-౧౧-౪౮)



# తత్త్వానందము

యతులు గతులు దప్పి కితవులు విత్తాభి
రతులు కామదాస్యరక్తులైన
వేళఁ గొండిపర్తి వీరభద్రుఁడు కావి
గట్టి నిల్పె దండి గౌరవంబు

పతిత ప్రజావికాసో
న్నతి కేర్పడె నాశ్రమంబు నాల్గవయది; భా
రతభూమి తద్బలంబున
బ్రతికెన్ బరధర్మమెంత పైకొనుచున్నన్

ఇచ్చటు విద్యారణ్యుం
డచ్చోటు సమర్థరాముఁ డబ్బుటన కదా
మచ్చు మెఱుంగని సంస్కృతి
నుచ్చైర్దశ వడసె జగ మహో! యన మెఱసెన్

ప్రాచీన పరివ్రాణ్మధు
రాచారము లూని మానవాభ్యుదయకర
శ్రీ చిక్కణ సేవావ్రత
రోచిష్ణుత నితఁడు యతివరుం డన నెగడెన్

చిక్కినజాతిఁ జూచి వగచెంది తమున్నతి గోరి వైదుషీ
రుక్కమనీయ వైభవ నిరూఢుఁ డితండు తెలుంగుబాసలోఁ
ద్రొక్కనిదారిలే డితని దొడ్డతనమ్మునకున్ విధేయులై
మ్రొక్కనివారు లేరు జనమోహన ధర్మపథానువర్తికిన్

ఔచితిగుట్టెఱింగిన మహాశయుఁ డౌట నితండు బాపుజీ
గీచినగీఁత దప్ప కవగీర్ణత నంది స్వతంత్ర భారత
శ్రీ చివురించుపొంటెఁ దన జీవన మర్పణ చేసి తద్రుచుల్
సూచి సుఖించి ప్రావెలుఁగుఁజుట్టముగా వెడలెన్ దలిర్చుచున్

తన తృప్తికిఁ బరతృప్తియుఁ
దన ముక్తికి నితరముక్తి తావల మని న
మ్మిన తత్త్వానందుఁ డితం;
డనవద్యం బితని చరిత మాదర్శ మగున్

(౨౪—౨—౫౩)



# ఉ లు పా

నీ కవితామహత్త్వమున ననేకశరత్తులనాఁడె సమ్మద
శ్రీ కలితుండనై చెలిమిచిందఁగ నుజ్జ్వలమైనభావి నీ
కై కల దంచు నుత్తరము నంపితి నింపితి నాశిషమ్ము నా
లేక ఫలించె నేఁ డని చలింపనిగర్వము గంటి సోదరా !

ఎపు డీ పండుగ వచ్చునో తెలుఁగునాఁ డేనాఁడు నీనాణెముల్
విపులాసక్తిని మెచ్చునో యనుచు నువ్విళ్లూరు నస్మాదృశుల్
తపముల్ పండినయట్లు పొంగి రఖిలాంధ్రక్షోణియున్ నీకు నేఁ
డుపదల్ పెట్టి వివేకమున్ గురిసె నీయోగమ్మె భోగమ్మురా!

భవదీయం బగు వీరభారత మహా! ప్రత్యక్షరప్రౌఢమై
నవలావణ్యశరణ్యమై ఋషివరుల్ నన్నయ్యభట్టాది స
త్కవిమూర్ధన్యుల శిల్పసంపదలకున్ గాణాచియై యుంట నీ
భవమున్ ధన్యముఁగాఁ దలంతురు రసప్రాణుల్ కళారాధకుల్

కారెమపూఁడిరంగమునఁ గయ్యము రేఁగిననాఁడు పౌరుష
శ్రీరుచిరుండవై రిపులఁ జెండినయోద్ధవునీవు; నాఁటి నీ
దారుణఖడ్గ మా నిశితధర్మమువీడనిగంటమై పురా
వీరపరంపరా ప్రథనవిక్రమరేఖ వెలార్చు నేఁటికిన్

పద్యమున గద్యమున గేయపద్య నొఱవు
నెట్లువడసితి నరసయా ! యిది పురాణ
పుణ్యములు సంతరించిన పొలి యటంచుఁ
దలఁచి పులకింత్రు సాహితీతత్త్వవిదులు

ఒసపరి తెలుంగు నీ కై
వసమ్మురా ! నీ వచించు వాణికి నసువై
పసగుల్కున్ నుడికారము
ప్రసన్నమై రసికభావ పర్వోదయమై

ఏను దిక్కనాఖ్య నెసఁగుటఁ దత్ "కవి
బ్రహ్మ"పట్ట మీవు వడసియుంట
నేన నీవు నీవ యే నైతి – మగుట నీ
గరిమ నాదుగరిమగా సుఖింతు

(౨౨-౮-౪౯)



# పుట్టుపండువు

(ముక్త్యాల రాకొమరునిది)

"హిమకరుఁడొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయ వం
శమున" నటన్న భారతవిశాంపతిఁగన్న చళుక్యవంశ—మాం
ధ్రమునకు విశ్వతోముఖ ముదాత్తత నించినవంశ—ముత్తమో
త్తమనరపాలవంశము పదంపడి తావకవంశమయ్యె నం
చమలమతుల్ పురాంధ్ర చరితాంతరవేత్తలు నిర్ధరించుటన్
సముచితమై తనర్చెఁగద చంద్రకుమారమహీశ! నీదు పేః
రమృతమయూఖసంతతికి నక్షరజీవిత మబ్బుటబ్రమా
కమలయనుంగుటల్లుని కఖండధనప్రతిపత్తి చోద్యమా
ప్రమథులనేలుసామితలపైఁ గులుకంగలవాని చొక్కపుం
గొమరుఁడు లోకమాన్యతను గొంట విచిత్రమె యోషధీశువం
శమున కనామయప్రభ లెసంగుట విస్మయమా బుధానుజుం
డమరకవిత్వసాహితుల కాకరమౌ టది యద్భుతంబె చం
ద్రమునిసుతుండు విశ్వజనతాపరితాపములార్చి పూజ్యతా
క్షముఁడగు టేమిలెక్క సడిసన్న కళానిధివంశ మందచం
దములకు నిక్కయౌట యరుదా వరణీయగుణంబులెల్ల సా
జములయిపొల్చె నీః కిఁక నొసంగెడి దీవనయేమి ధన్యతా
సముదయమూర్తివీవు ప్రభుచక్రవతంసుల శాతవాహ భూ

---

రమణులదండఁగొల్వ యిపురామహిమఘ్నలు నాఁచికొన్న రా
జ్యముగద నీది సహ్యాతసయాలహానీ పరిశీతవాతముల్
దిమిదిమిసేయఁగా నివతరించుఁగదా భవమర్ద్వ మహిత్వనిం
జమరి నితాంతనిర్వృతు లొసంగి జగంబులనేలునేలు పా
నమదమరుండు వేదగిరినాథుఁడు నీ మొగసాల పారిజా
తముగద సర్వమంగళవిధాయి భవాని భవన్నిలింపర
త్నముగద రామభారతకథాకలి తాంధ్రమహాకృతిద్వయీ
రమణుఁడు నీకుఁ దాతగద రాజకులంబున కోజబంతిమై
క్షమఁగల విద్వదగ్రణుల సత్కవిసింహులఁ బిల్చి మెచ్చి వి
త్తములిడు రామకృష్ణవసుధాపతి తండ్రి గదయ్య నీకు ని
ట్లమరిన యాభిజాత్యలత కల్లిక పెట్టెద వీవు నీకథా
క్రమములు భవ్యకావ్యములుగా సుకవుల్ సృజియింత్రు రాట్సుతా!

౨౨-౧౨-౮౮



# పాములపాటి

పాలించితివి గర్తపత్తనమండలం
బఖిలాంధ్ర జయర వాభ్యంచితముగ
నెలకొల్పితివి సీమఁగల పల్లెపల్లెకు
నున్నతవిద్యా ప్రయోగశాల
పోషించితివి నైకభాషా మనీషుల
నుద్యోగ సద్యోగ యుతులఁ జేసి
చిత్రించివి ప్రజాసేవానురక్తుల
పాలింటి యొజ్జయా మేలిబాట
గడనచేసితి హరిదంతకరి కపోల
తటసర ద్వాఃకణప్రీత చటుల మధుప
గీతము యశమ్ము వేంకటకృష్ణసుకృతి!
తావకము జీవనం బహూ! ధన్యతమము

హితమిది మాతృభూమి కని యెంచుట నించుట నాంధ్రమండలీ
ప్రతినిధివై సమస్త సదుపాయములన్ సమకూర్చి కర్షక
వ్రతములు పండఁ జెచ్చితివి * భావపురవ్యవసాయపీఠ; మీ
చతురత కీయుదారతకు సర్వజగమ్ములు పొంగె ధీనిధీ!

(౫-౧౨-౮౬)



* బాపట్ల వ్యవసాయ కళాశాల

# వివేకానందుఁడు

"పదునేనూఱు వసంతకాలము లనల్ప శ్రీవికాసమ్ములై
పొదలంగాఁ దగుతావిఁగల్గిన మహాబోధ ప్రసూనమ్ములన్
వెదచల్లంగనినాఁడ నీతను విఁకన్ వేసారిన్ జాఱెసన్
గొదవే"మన్న భవన్మనోబలమె మాకుం బ్రాపు యోగీశ్వరా!

కూటికి సన్నుసన్నురని కుందెడి కందెడి కుక్కయేని యీ
నాఁట నొకండు కంటఁబడినన్ మునుముందుగ దాని నేర్పునా
రాటముఁదీర్పు టేమతమురా! యని మాయనిధర్మతత్త్వమున్
జాటిన నీ వివేకము ప్రసన్న మొనర్పఁగదే జగద్గురూ!

తీయనిమన్ననల్ కురిసి తేర్చి యధఃపతిత ప్రజాళికిన్
బాయని బాంధవుండవయి భారతజాతి భవిష్యభాగ్య సం
ధాయకుఁడౌ మహాత్మున కుదారచరిత్రునకున్ దరిద్రనా
రాయణసేవ నేర్పితివిరా! పరమార్థఖనీ! మహామునీ!

"మావిద్వాంసులు తార్కికప్రవరు లస్మద్విశ్వవిద్యాలయ
శ్రీ వాలించుగురూత్తముల్ శ్రుతిశిరస్సీమంతినీ పాద సం
సేవాపూర్ణుఁడవైన నీయెదుటఁ గించిన్మాత్రులే" యంచు హ
ర్షావేశమ్మున మెచ్చిరా! నిను యతీంద్రా! యెల్లపాశ్చాత్యులున్

(౨౯-౧౦-౫౨)



# ఆర్తబంధువు

కలిమికి నాటపట్టు లనఁగా మనభూముల నెంద ఱెందఱో
వెలసిరి గాని చేపడినవిత్తము నర్థులపాలుసేయు దా
తలు మనకెందఱుందురు ? వదాన్యులలో నినువంటి దీనబం
ధులు కరుణావిధేయమతిధూర్వహు లెందఱు? గ్రంథెసత్తములా!

ఎక్కడఁగన్న నోట్లకొఱకే చెరలాడుచు మేడమిద్దెలున్
రొక్కము చేను చెట్టు పదిరోజులగద్దెకు ధారవోయు తి
ర్యక్కులు పొంగి పొర్లుసమయమ్మున నీకు ననాథబాష్పపుం
జుక్కలు చుక్కలై వెలుఁగుచూపినవా! * వరదాఖ్యసత్కృతీ!

వెన్నవలెన్ ద్రవించి గుణవృద్ధు లహో! యన నార్తసేవకున్
బన్నితివా! నినుం దలఁచుపట్టున గౌతమబుద్ధమూర్తి నా
కన్నులముందు నిల్చి పులకల్ గదియించు సబర్మతీసరిత్
సన్నిధి నున్నయోగి వికసన్ముఖుఁడై తనపజ్జ నిల్వఁగన్

పాయనిదీక్షమైఁ దనదుప్రాణములన్ సిరులన్ దరిద్ర నా
రాయణసేవ కిచ్చి యమరత్వము నందినగాంధికోవ నీ
దై యిటువంటిధన్యతకు నర్హునిఁగా నినుఁ దీర్చె 'గ్రంథి' కా
దోయి! భవద్గృహాంక మిఁక నుజ్జ్వలమౌ నది 'గాంధి' సంజ్ఞమై

* వీరు చిలకలూరిపేటలో 'అనాథ శరణాలయము' నిర్మించిరి

ఎదికర్తవ్యము విత్తవన్మణుల కీహిందూమహా శాంతి సం
పదకుం దావలమెద్ది పుణ్యరమకుం బ్రాసాదమై నొల్చు నె
య్యది కస్తూరిమగందునేర్పిన మహీయ స్తారకం బేది నీ
వది చేకొంటి వనాథసేవ, మహాత్మా! నీకు దీర్ఘాయువుల్!

తన కగపడ్డసంపదలు తాన భుజింపక లేనివాని కా
ధనమునఁ బాలువెట్టు టుచితం బనుపాఠము నేర్పి తీవు నీ
మనుగడబాట నూటఁ బదిమంది పఠించిన వర్గభేదముల్
పెనఁకువ లుండునా? ప్రళయభీకరతాండవ మూర్వి నింపునా?

హైందవసంస్కృతి చేత
సౌందర్య మఖండతత్త్వసంపన్నత నీ
యం దొదిఁగి నిన్ను జగదా
నందకరున్ మధురజీవనపరున్ జేసెన్

వరదయ్యా! నిను గద్యపద్యములతో వర్ణింతు రాపన్నులై
తెరువుంగానని పేదలన్ మనుపునిన్ దీవింతు రావెన్క నీ
పరమాదర్శము నియ్యకొన్నసతికిన్ బ్రత్యేకశంసా బహూ
కరణం బిచ్చెద రాంధ్రు లేమనెద నీ కల్యాణిభావోన్నతిన్?

సంతతిలేక నెవ్వగల స్రగ్గి నిరాశలఁ గ్రుంగి దుర్భర
ధ్వాంతమువోని జీవనముపై రుచిదప్పి తెగించి యీవికిన్
సంతనకట్టువారుగల జాడ తెలుంగుదుఁ గాని మీవలెన్
సంతుసమున్నియున్ బెఱలసంతును మోసెడివార లుందురా!

తల్లులు తండ్రులై పరమదైవములై యొకదిక్కులేని యీ
పిల్లల నుద్ధరింపుఁ డీఁకఁ బెట్టనికోటలు మీరు వీరికిన్,
ముల్లెలమూల్గులం దనియుమొండికి రిత్త పిసాళి వెచ్చముల్
చెల్లుట మెచ్చుసాహునకుఁ జెప్పనిబుక్కులు మీచరిత్రముల్

దాతల నేతలన్ బుధవతంసుల మంజులకావ్యశిల్ప ని
రాత్ముల గీత వాద్య చతురత్వవిధాతల నార్తమానవ
త్రాతలఁగన్న గర్తపురధాత్రి తెలుంగునరాజధానియై
నూతనశోభఁగుల్కఁ నీఁక నోములుపట్టుఁడు మీరు దంపతుల్!

ఉత్తమశీలురతలఁపులు
దాత్తచరిత్రుల తపమ్ము తప్పక పండున్
రిత్తలు వల్కుట కస్మ
చ్చిత్తము సైరింప దేను శిష్టుఁడ నగుటన్

(౧౫-౧౦-౫౩)



# నాగయ్య

తెలుఁగుభాగవతమ్ము తెరదీసి నిద్రాణ
జాతి మేల్కొల్పిన పోతరాజు
ఆటవెలంది యొయ్యారమ్ముతో నభి
రామసంస్కృతి పంచు వేమయోగి
స్వరరాగమూర్తియై స్వర్గాపవర్గమ్ము
కనులకుంగట్టు త్యాగయతపస్వి
శీలమ్ము సడలినజీవి కోల్కొనఁ డన్న
రాణ దెల్పిన శివరామభోగి

రాకచే వచ్చెఁ గోదండరాముఁ డిటకు
నిచటబంగారుపండెనై దేఁబు లుబికె
సాధుతరధర్మరేఖ సాక్షాత్కరించెఁ
గలిమి ఫలియించె నేఁ డప్పికట్లపురికి

ఎవ రీనాగయ ? మా త్రిలింగనటరాజే యంచు మాజాతి వై
భవమే యంచుఁ దెలుంగువారు జయగర్వస్ఫూర్తిమ న్మూర్తులై
చివురుల్ వెట్టఁ "గలామయుండితఁడుమా సీమన్ గదాపుట్టె" నం
చివతాళించెద మేము మాసుకృతసాహిత్యంబు కొండాడుచున్

కవివరులున్ నటాగ్రణులు గాయకముఖ్యులు జాతిసంస్కృతి
చ్ఛవులు సృజించువా రనుటఁ జాటు నఖండమహీచరిత్రముల్
కవితయు నాట్యకౌశలము గానపటుత్వము నిన్నుఁజేరి నీ
కవిరతకీర్తి గూర్చెఁ జరితార్థుఁడ వీవుకదయ్య! నాగయా!

లక్షలు తెచ్చి తావకకలారమ నిన్ యజియింప నీ వహో!
భిక్షులుమెచ్చి దైన్యపరిపీడితులన్ భజియింతు వీ కృపా
దీక్షకు ముగ్ధమయ్యె జగతీవలయంబు వదాన్యమాళి! నీ
పక్షమునందె సత్కృవులు పల్కెడ రంజక సాగిపో మ్మిటుల్

సాగినది తెల్గుతల్లి కాంచనరథమ్ము
పండినది తెల్గుజాతి నిర్భరతపమ్ము
సోదరాంధ్ర వికాసముల్ ప్రోదిసేయ
వలయు నాకల్పము నటింపవలయు నీవు

(౨౩-౫-౫౩)



శ్రీ నాగయ్యగారిని బాపట్ల తాలూకా "అప్పికట్ల" పౌరులు సమ్మానించినతఱి

## నా కథ - సీత

(ఆ స వు)

వసుధాసవిత్రి నన్నుం
బ్రసవింప మదీయపుణ్యపరిపాకమునన్
వసపడితి యోగవిద్యా
రసికుఁడు జనకునకు జనకరాగము వఱయున్

జనకుఁడు కన్నబిడ్డవలె సాఁకి ననున్ గడుముద్దుసేయ మ
జ్జననము సార్థకం బనుచు సంబరమందితి నందచందముల్
పెనఁగొన నెల్లవిద్యలను బెంపువహించితి నస్త్రశస్త్రముల్
గని నెఱనేర్పు లందితి జగమ్మునవారు సమాదరింపఁగన్

కడచినది నాదుబాల్యము
పొడమెను జవ్వనము వీరపురుషోత్తము నా
యొడయనిఁ గావింప గురుం
డుడుగనితలపోఁత మునిఁగె నురలెడి కూర్మిన్

శివుఁ డెపుడో తద్భూపతి
భవనమ్మున విడిచెధనువు; ప్రాఁతదియైనన్
లవమాత్రమ్మును సడలక
హావణిల్లుచునుండె నది నవాతినవంబై

హరకోదండము దాని నెవ్వఁడు సముద్య ద్బాహువీర్యమ్మునన్
విఱుగంజేయు నతండ మత్ప్రియుఁడుగాఁ బృథ్వీశుఁ డూహించి యీ
ధరలోనం గల రాజనందనులవందల్ వేలు రావించి సుం
దరపద్యన్ నడిపెన్ స్వయంవరము పెద్దల్ పిన్నలున్ మెచ్చఁగన్

ధరణీఖండము లన్నిట
నెఱిగల నృపసుతులువచ్చి నిక్కిరి గర్విం
చిరి శివునివింటిముంగడఁ
బరాక్రమముసూపి రెల్లపాటులతోడన్

ఒకనిబడి నొకఁడుగా వ
చ్చి కరోద్ధతి చూపి పరువుసెడెనే యనుచుం
గకవికలుసెంది సభ్యులు
పకపక నవ్వంగ ఱిచ్చపడి రవ్వేళన్

జలధరశ్యాముఁ డొకఁడాసభకు వచ్చె
నపుడు చూపఱకన్ను లాహా! యనంగ
వీరరాఘవుఁ డతఁడు తద్విక్రమమ్ము
సకలరాజకుమార విస్మయకరమ్ము

బెండువలె నతఁడు వింటిని
రెండుగ నొనరించి శౌర్యరేఖ వెలార్చెన్
బండువు చేపడె నాకున్
దండిగ ముద మొదవె జనకధరణీపతికిన్

తూర్యములు మొరసెఁ గవితా
ధుర్యులదీవనలు కురిసె ప్రహిణాదుల ము
చ్చర్యలు విరిసెం బురము న
వార్యంబై కౌతుకప్రవాహం బొరసెన్

మంగళగీతికల్ మధురమంజులరీతుల సాగ నప్పయో
దాంగుఁడు మత్కరంబును సమాదరబుద్ధి గ్రహించినంతఁ బే
రంగద నున్నలోకమున కగ్గపడెన్ బ్రమదమ్ము, రక్కసుల్
భంగపడంగఁదగ్గతఱి వచ్చెనటంచుఁ దలంచి రెల్లరున్

"నాపొత్తులేని శౌర్యా
టోపం బది యెంతయున్న డొంగను దనుజున్
బాపాత్ముని రఘురాముఁడు
రూపడఁపంగలఁడె నిర్జరులు జయపెట్టన్

సతితోడు లేనివేళలఁ
బతి యెంతటివీరుఁ డైనఁ బండితుఁడైనన్
నుతికెక్కఁగలఁడె" యని నా
మతి నెన్నోతలఁపు లపుడు మల్లడిగొనియెన్

నోఁచిననోములు పండెను
దాఁచినధనమెల్లఁ గరగతంబయి నిల్చెన్
నా చారుమూర్తి మధుర
శ్రీ చిక్కణపేటి వీరసింహుఁడు దొరకన్

మగనితోడఁ గూడి మనిచినవారికై
నతులుసెప్పి చెలులమతులు తేర్చి
యత్తవారియింటి కప్పుడు పయనమై
వచ్చుచున్నదాన వనపథాన

"మానిత విక్రమబంధురుఁ
డే నుండఁగ సీతఁ దెవ్వఁ డీశ్వరచాప
శ్రీనడఁప" ననుచు భార్గవ
సూనుం డెదిరించె రక్కసులబలుగొంగన్

ఆ ముదిపగ్గు రాముఁ డన నర్భకుఁ డంచుఁ దలంచి శౌర్యమున్
స్థేమముఁ జూపి శస్త్రవితతిన్ బరఁగించెనకాని యెవ్వరీ
భూమిని మత్ప్రియుం బొదివి పోవఁగలా రసుకోటితోడ? లే
రీమహిఁ గాదు లోకముల నెందయినన్ విభు నోర్చుపోటుగల్

పరశురాముఁడు వితథమై పాడునడిన
తనమగంటిమిఁ దలఁచి సిగ్గున మునింగె
వలదు వలదు ప్రభూ! లజ్జవలదు నీ ప్ర
సాద మిది యంచుఁ బలికె భూజానిమౌళి

ఆ వినయ మా సుశీలత
యా విక్రమలక్ష్మి భార్గవాత్మజునకు మో
దావహ మయ్యెను బతిపై
దీవలనన్ గురిసె నతఁడు దివ్యులు కులుకన్

అఖిలసభ్యజ నారాధ్య యగు నయోధ్య
కపుడుసేరితి మేము రావమ్మ! యనుచు
నా పసిండి! యటంచు హృత్తాప మెడసి
యత్త ననుఁ గౌఁగిలించె రేకెత్తుప్రేమ

కౌసల్యకు మామయ్యకు
నాసలు పండినవి నాఁడు; "నా కేశునకే
నీ సంతోషము కలదా?
త్రోసితి నఘు" మంచు దశరథుఁడు కడు సొగసెన్

"కొడుకునకుఁదగ్గ కోడలిఁ
బడసితిఁ బరిమళము పొడమె బంగారునకున్
గడగండ్లతోడఁ దపముల
బడలి బడలి కంటి నిట్టిభాగ్య" మటంచున్

మామగారు తనదుమది పొంగ మంగళా
రవము లెల్లయెడలఁ జెవులపండు
వులు ఘటింప నుత్తముల విప్రులను బిల్చి
పండితులను జేర్చి ప్రబ్బుకొన్న

కౌతుకముతోడ వస్త్ర
వ్రాతమ్మును కొన్కవెట్టి వరణీయాన్న
శ్రీతతు లొసంగి మఱి కా
ఫీ తేనీ రిచ్చి పెద్దవిందులు నడిపెన్

ఒక యయోధ్యక నా నేల యుర్వికెల్ల
నవ్యసంక్రాంతి యయ్యె నానాఁడు దశర
థేశునింటన కా దెల్లయిండ్లయందుఁ
జక్కఁగాఁ జాగినవి పెండ్లిసంబరములు

రామునితోఁ దతోస్సోదరు
లా మువ్వురు పెండ్లియాడి రంచితశీల
శ్రీ మెఱయు నూర్మిళాదుల
రామారత్నముల మధురశా గాంచితలన్

ముగురత్తలు నేరాండ్రొక
ముగురున్ లభియించి హర్షమున మించిరి నన్;
జగదేకవీరుఁ డగువిభుఁ
డగపడె మామయ్య పూజ్యుఁ డబ్బెను దనకున్

అల్లారుముద్దుగా నా
యిల్లున్ దిద్దుకొనుచుంటి; నిట్లుండ మహీ
వల్లభుఁడు జరావృతుఁ డై
డిల్లపడె నిలా భరణ పటిష్ఠత సడలన్

పెద్దకొడుకు ననుఁగుబిడ్డను రాఘవు
నఖిలశాస్త్రవేది నంచితాత్ము
నధిపుఁ జేయనెంచె నపుడు వసిష్ఠాది
మునులు మెచ్చి రతఁడు కనినతెఱఁగు

రామ పట్టాభిషేకకార్యము సమీప
మయ్యె "నే రాణి నౌదు" నటన్న వేడ్క
ననుఁ బెనంగొనెఁ గాని తిన్నందనమ్ము
నెడసి విధి యింతలోఁ గొంప కెసరువెట్టె

మామయ్య మున్ను దనుజ
స్తోమమ్మును ద్రుంచుపట్ల సుడివడఁ గైకా
భామిని సంగ్రామకలా
శ్రీ మిగులన్ గాసెకట్టి జీవితనాథున్

మృతికి దూరుఁ జేసి మెప్పించెనఁట - మామ
యపుడు రెండువరము లామె కిచ్చె
నఁట- తదీయశక్తి నాయమ్మ "నాసుతు
భరతు రాజుఁ జేయవలయు" ననుడు

పెద్దవాఁడు వాసి తద్దయుఁ గలవాఁడు
రాముఁ డుండఁగా భరతున కెట్లు
రాజ్య మిత్తు నవ్వరా ప్రజ లిది విన్న ?
నని కలంగె దశరథావనిపుఁడు

లోక మెటు లాడుకొన్నను
వాకును దప్పంగ నర్కవంశ్యుల కగునా ?
యీ కార్యము తప్పని దని
యేఁకారుట మానె మానవేశ్వరుఁ డంతన్

కన్నకొడుకు జేఁడు కావుట చాలక
యధిపు వనికిఁ బంపి రత్తగారు;
జంటవిడక మగని నంటి జీవించు లే
పడఁతిధర్మ మన్న పాడి నెఱిఁగి

తోనఁకక యేనునున్ మగనితో వనభూమికిఁ బైనమైతిఁ గా
ననములు శైలరాజము లనంతమరుత్క్షితులున్ గ్రమించి యొ
య్యన చని దండకావనమునందు వసించితి మెల్లమెల్ల మా
యునికి నెఱింగి సర్వమును లుబ్ధి రహో! విడరానిబంధులై

అన్న దేశభక్తి నాతని
వెన్నడి లక్ష్మణుఁడు వచ్చె విపినమ్ములకున్
నన్ను రఘురాము నిచ్చలు
కన్నుల నిల్పికొని పూజ కావించుకొనెన్

సౌమిత్రియందు కల్గుట
రామునకున్ నాకు వని పురంబయి తోఁచెన్
నామగఁడే దేవుం డని
ప్రేమించెడి ఋషులఁ జూచి పెరిఁగితి నేనున్

"దేవుఁడు రాముఁడైన మఱి దేవి మహీజయకా" యటంచు నే
భావమునం దెలర్చితిఁ "దపంబులు పండుటఁ జేసి రాఘవ
శ్రీవరు కేలు పట్టితి యశమ్మునుగంటి నయోధ్యమైన నా
జీవనమైన నొక్క తెఱఁగే" యనుతృప్తిని గంటి నవ్వలన్

తనయనుజన్ దనమిత్రులఁ
దనబంధులఁ జంపె రామధరణీశుఁ డటం
చెనలేని రోసమున రా
వణుఁ డసురసురల్యో 'నెంతవచ్చె' నటంచున్

లోకములనెల్ల గెల్చిన
నాకా యిటుసేఁత యల్పనరుఁ ? డంచు మదో
ద్రేకమున లేచి యపర పి
నాకివలెన్ సాహసించి నాథునికటికిన్

బంగరులేడిగా నొకయభాగ్యుని దానవుఁ బంపి భర్తకున్
భంగము తెచ్చి లక్ష్మణుని ప్రాపును గోల్పడి యేను బేలనై
యంగద నుండునట్టు లకటా ! వలపన్ని పిసాళిజోగి రీ
తిం గొని నన్నుఁ జేరి వితథీకృతనీతి యతం డతంత్రుఁడై

దిక్కులేని నన్నుఁ దక్కొని లంకకుఁ
జేర్చినాఁ డఘమ్ము పేర్చినాఁడు
దయఁదొఱంగి కొఱవిదయ్యాల నాచుట్టుఁ
బెట్టినాఁడు దనుజుఁ డెట్టివాఁడొ

"జగముల గెల్చినట్టి రణశౌండుఁడ, సర్వదిగీశవర్గముల్
పగవిడి నన్నుఁగొల్చు, ననపాయము రాజ్యము నాది, రాముఁడా
మగఁడగు నీకు? నీమధుర మంజులరూప మదేడ వానిపైఁ
దగుల మదేడ బుద్ధివలదా యిటువంటి మనోజ్ఞమూర్తికిన్

నీకుఁ దగినమగఁడ నేనని పదితలల్
కలవు నా కటంచు గర్వ మెగయ
నను బలాత్కరింప నానాశ్రమల్ పడి
నాఁడు తెచ్చపోయినాఁడు తుదకు

అతఁడు హరుఁడైన నేమీ
పతివ్రతను ధిక్కరించు బలసంపద నే
గతి వడయు? నస్త్రజాలము
నతి సేయఁగవలయు సాధునారీమణికిన్

ప్రాణేశుకొఱకు వార్చుచుఁ
బ్రాణమ్ముల బిగ్గఁబట్టి పరమకిరాత
శ్రేణుల జంకెనలం బడి
గ్లానిన్ గాలమ్ము నెట్లొ కడపితి లంకన్

అంత హనుమ వచ్చి కాంతునిజాడ నా
చెవినివైచి లంకచెలువ మార్చె
వనధిఁగట్టి మగఁ డవారితుఁడై దశ
గ్రీవుఁ దునిమె నమరకీర్తి వెలయ

రామునితో నతదేవ
స్తోమునితోఁ బురికిఁ జనితి దుఃఖము లడఁగన్
మామయ్యా లేమిఁ దలఁచితి
నేమీ ద్వంద్వములు తప్పవే యనుకొంటిన్

పట్టాభిషిక్తుఁడై విభుఁ
డిట్టలమగు నెమ్మి నవని నేలుచునుండన్
నెట్టికసీలతనమ్మును
బట్టి రఘుప్రవరు నేను బాయక కొల్తున్

ఇది నాకథ – కౌసల్యా
సుదతీసుతుఁ డాదరించుసుకృతము నాపా
లిదిగా నిది గాంచితి రా
ము దయన్ భువనములకెల్ల ముదము లొదవుతన్ !

(౨౯–౫–౫౩)



ఇది మిత్రులువ్రాఁతకు పీలుగా చింతాయ
పాలెము సభలో అరగంటలో చెప్పఁబడినది

# శాంతిగీతము

బానిసము దుర్భరంబు దుర్భర మటంచుఁ
గాయము తటిచ్చలం బతిహేయ మనుచుఁ
దగదు కొలటుచట్టంబు తగ దటంచు
జాతిగౌరవ రక్షణాసక్తు లగుచు
నేలప్రొద్దు లెఱింగిన నేత లగుచు
శాంతిసమరాంగణమున నిశ్చలత నిల్చి
డయ్యరు తుపాకినుండి 'ఢాంఢా'మ్మటంచు
గుములుకొని దూఁకు నగ్నిగోళములదాటి
కెదురుగా ఱొమ్ములను జూఁపి బెదరులేక
ప్రాణములు ధారవోసిన ప్రభువులార!
పుణ్యభూములు త్రొక్కిన పురుషులార!
శాంతులా మీరు? వీరపాంచాలురార!

మఱచితిని మీ యనుంగుసోదరులు దాస్య
భారమునఁ గ్రుంగి కుములు నంబను స్వరాజ్య
సింహపీఠికపైఁ బ్రతిష్ఠించుదనుక
నబ్బునా చిత్తశాంతి మీ కన్నలార!

నాఁడు 'జలియనువాలా' వనమ్మునందు
నగ్గలంబైన త్యాగమ్ము నవధరించి

మార్గదర్శకు లైనారు మాకు మీరు
మఱవఁ దరమౌనె మీమేలు మాన్యులార!
సన్నగిలుచున్న వహ్ని కాజ్యంబువోలె
వాడి చెడుచున్న కయ్యాకు నానవోలె
సాయపడె మాకు మీ సముజ్జ్వలచరిత్ర

ధీర జాతీయభావముల్ తేజరిల్ల
హిందువులు ముస్లిములు నేఁడు విందు లగుచు
నెన్ని రాపిళ్లు మూఁడిన వెన్ను చూప
కరుల నూఁగింతు రచలసత్యాగ్రహమున
బళిరె! యెన్నాళ్లనుండియో పండకున్న
తలఁపులు ఫలించె మాకు మీ త్యాగమహిమ
'భారతీయుండ నే' నని పల్కరించు
మనుజుఁ డున్నంతకాలంబు మాసిపోని
కీర్తిగద మీది శూరతామూర్తులార!

సర్వశక్తిపరీతుఁ డీశ్వరుఁడు కరుణ
నిమ్మహాదేశమును స్వతంత్రమ్ముఁ జేసి
మీమదికి శాంతి నొదవించి మీకు మాకుఁ
దరుణ సమ్మోదలక్ష్మీ ప్రదాత యగుత!

౨౨-౪-౨౫



# రైతుమొఱ

జగదీశ ! దీనరక్షా లగ్నబుద్ధి
నీ వవతారమ్ము లెన్నేని తాల్చి
దుష్టరాక్షసకోటిఁ ద్రుంచితి కాని
కటకటా ! యక్కటికములేని నరుల
నేల మన్నించితో యెఱుఁగ కున్నాము
కటికిగుండెలకు నగ్గంపడి చెడిన
యీనాఁటి మాబ్రదు కీక్షింప వేమి
నిండారుకూర్మిమై నేమును నీకు
రక్షింపఁదగినవారము గా మటయ్యా

ప్రభువరా ! మమ్ము నోంపనిభయం బేది ?
బాబయా ! మముఁ గలంపనిశక్తి యేది ?
యాగర్భభోగుల నల్లాడఁజేయు
దుష్కాల మరుదెంచె దుర్భరం బగుచు
నడఁగారదయ్యో మా యశ్రూర్మిపటలి
బ్రదుకఁగా వెరవు కన్పడదయ్యో మాకు
నీనాఁడు నీవుగా కెవరు మాదిక్కు ?
మాతప్పు లున్నచో మన్నింపు ! దేవ !

మృగములు విహంగమ్ము లేబాధలేక
తమపొట్ట నిండించి తనివి నందెడిని
బగలెల్ల మాబండిబరు నీడ్చి యీడ్చి
మంచిమేఁతలు మేయక మాపులం దెన్నొ
కష్టించి కడపకుఁ గడపకుం దిరిగి
కుక్కలుం దమపాలికూటి నార్జించు
నీపాపమేమొ! తండ్రీ! ప్రాణితతికి
నన్నంబు సృష్టించునట్టి మాజాతి
కఠినోపవాసముల్ గావింపవలసె
వెచ్చవెచ్చనియూర్పు వెడలింపవలసె

ఓనాథ! విను మొకానొకనాఁడు రైతె
భారతావని 'నార్య'పదవాచ్యుఁ డయ్యె
'నన్నదాత' యటన్న యాఖ్య యీనేల
నితనికే సిద్ధించె నెల్ల రౌ ననఁగ
జనకునింబోని రాజర్షిసత్తముఁడు
దున్నె లాంగలము దుర్దుఃఖాబ్ధికలము
సాధ్వీమతల్లి నాఁ జాలిన సీత
కలిగె మా పసిఁడినాఁగటిచాలునందె
పతితపావనుఁ డై నబలభద్రమూర్తి—
మూఁపుపైఁ గుల్కె మా ముద్దునాఁగేలు

మాయింటి పాపఁడై మలక్రియ్యలందు
నాలమందల మేపె హరి గంతులిడుచు
మా చరిత్రల కేమి మా పేర్మి కేమి
దీనతానిధుల మైతిమిగాని నేఁడు

మా మూలమున సభామాన్యత వడసి
వన్నె వాసి గడించువారలే మమ్ముఁ
గడుఁ జుల్కపాటుతోఁ గాంచుచున్నారు
మా యొనర్చినమేలు మఱచుచున్నారు
పన్నులవ్రేఁగు పైఁబడి క్రుంగుచున్నఁ
జదువుసంధ్యలు లేక స్రగ్గుచునున్న
దారిడొంకలు లేక తలఁకుచునున్న
మందుమ్రాఁకులు లేక మల్లాడుచున్నఁ
ద్రాగునీళ్లును లేక తపియించుచున్న
మాగోడు నెత్త రీ మానవోత్తములు
మాకీడు త్రోయ రీ మకుటాలవారు
రంగ దుత్తుంగ తరంగయై గంగ
చెంగటఁ బెనుమ్రోఁత సేయునే కాని
బీఱెండతాఁకున బీఁటలువాఱి
మానంజ మాపుంజ మలమలమాడె
మాపాఁడి మాపంట మఱుఁగునం బడియెఁ

గృషిజోలికిం బోని యేలిక లేల
నీ వుండఁగా దిగుల్ నెసులు మా కేల
రానిమ్ము రానిమ్ము రతనాలజల్లు
చేకొమ్ము! చేకొమ్ము! జేజేలపెల్లు

పల్లెపట్టే కదా భరతోర్వియన్నఁ
గమ్మతిఁడే కదా గ్రామంబటన్నఁ
గర్షకానందమే కద జగత్తుష్టి
రైతే కదా దేశరమకు వెన్నెముక
కాఁపేకదా లోకకల్యాణదాత
సేద్యగాఁడేకదా జీవన న్మిలకు
నీకర్మయోగి పెం పించుచుందాన
నీహాలికుని మెప్పు లెనయుచుందాన
నీనగ్నసత్యమ్ము నెఱుఁగుచుందాన
మా నేతలను దిద్దుమా గుణోద్ధామ!
మా భ్రాతలను దేర్పుమా దయాధామ!

౮-౧౧-౭౯



శ్రీ మైథిలీశరణగుప్త హిందీకృతి 'కిసాన్' ఛాయలతో

# కృతజ్ఞత

(అప్పికట్ల సమ్మానములో)

ఓసుగుణాఢ్యులార! మహిమోన్నతులార! సదస్యులార! వి
ద్యా సముదీర్ణులార! కవితావనితాపరిరంభణ ప్రభూ
తాసమకీర్తులార! రసికాగ్రణులార! నమస్సహస్రముల్
చేసెద మీకు న న్నొకవిశిష్టునిగాఁ గొనియాడి క్రొవ్విరుల్
దోసిటనెత్తి సత్కృతివిధుల్ పచరించుటఁజేసి నిర్భరో
ల్లాసముకల్గె, మై పులకలన్ మునిఁగెన్, సకలేంద్రియమ్ము ల
భ్యాసములేనిసంతసము నందె, నహో! సరిక్రొత్తపుట్టువున్
మోసితిఁగాని విశ్వజనమోహన సత్కవితా మనీషితా
భాసురులైన యిట్టికవిపండితశేఖరు లున్నకొల్వులో
గాసటబీసటల్ చదివి కావ్యకలాచతురత్వ మర్మముల్
వీస మెఱుంగలేని యవివేకికి నా కిటువంటిమెప్పు లే
లా సెలవిండు! మీరు మధురాశయు లౌట నుదారు లౌట న
న్నీసభలోన మెచ్చితి రిదే కడునిక్కముగాఁ దలంప నిం-
డీసమయమ్మునందు జనియించె నొకానొకశంక, "నిందు సా
వాసముచే నవజ్ఞయ ధ్రువమ్ముగ నబ్బు" నటన్నమాటలో
దోసముచూపి బాంధవముతోఁ జెలికారముతో నెసంగు న
న్నీసరిలేనిమన్ననల నెట్టులుతన్పిరొ యప్పికట్లవా-

రీసు జనత్వ మెందుఁగలదే వలదేయిటువంటిబుద్ధి – వి
ద్యాసముపేతులై సుకవితానిధులై తగు పున్నయాదికుల్
కైసరు లున్నపట్టణమె కానుక లిచ్చుటఁజేసి తద్దయున్
వాసిగడించె నీసభ – యవారణ మేత దఖండవైభవం
బీ సకలాంధ్రదేశమున కెక్కు, మనుష్యున కేని కేని ప్రా
గ్వాసన లున్నఁగాని యిటువంటికృతుల్ పచరించుకోర్కి రా
దోసుకవీంద్రులార! వినయోక్తులు కావివి నా సమగ్ర వి
శ్వాసముమై బయల్పఱచు వాక్కు లయా! – భవదీయనిస్తులా
శాసనగీష్పరంపరల సాయమునన్ రసవత్ప్రబంధముల్
వ్రాసెదనేమొ, వెండి యనవద్యసపర్య లొనర్చి యాంధ్రవా
ణీసతి కిత్తునేమొ వరణీయవిభూషలు, సత్కవిప్రథా
వాసితజీవనమ్ము నడుపంగలనేమొ, తదీయనైపుణం
బే సమకూడునట్లు జగదీశ్వరుఁడున్ గరుణించుఁగావుతన్!

౧౨–౭–౪౨



# చంద్రమౌళి

అన్న! కల్లూరికులజ! నా కన్న తెలుఁగు
పెద్ద లీయెల్లసీమలఁ బెక్కు రున్న
నవశమై ములుసూపు నాయాత్మ నిన్నుఁ
జూచినంతన నీదెస కేచి యేచి

ఏమి యీరహస్య మేలాజనించె నీ
పక్షపాత మని పరీక్షసేయ
నిక్క మెఱుకవడియె నీ వజాతవిరోధి
వగుట యొండె హేతు వయ్యె నిచట

త్యాగములు సేయవచ్చును
భోగమ్ములు రోయవచ్చుఁ బురుషుఁ డధర్మ
ప్రాగల్భ్యముగల రిపునెడ
రాగమ్మును బఱుపలేఁడు రా నిర్మముఁడై

ప్రత్యపకారము నైనను
మత్యంచితు లైనవారు మరగరు, సాధు
స్తుత్యం బీదృశభావం
బత్యర్థతపఃఫలంబవై నినుఁ గదిసెన్

నీ మనుగడ కెరవాడ
శ్రీమందిరయోగిత్రోవ జీవము నొసఁగెన్
నీ మేలిమేలి కొల్వుల
నామెతలం బడసెఁ గాంగ్రె సాంధ్రధరిత్రిన్

వేలల్ దాఁటిన దేశభక్తి నినుఁ గవ్వింపన్ బ్రజాసేవలో
వేలున్ లక్షలు లెక్కసేయ వని నే విడ్డూరముం జెంద న
ప్పోలీస్‌రక్కసి *నాఁడు కన్నుఁగవ నిప్పుల్ రాల నిన్ గిట్టి డా
కేలన్ గుత్తుకనొత్తియెత్తినను గాంగ్రెస్‌పీడమిన్ మెచ్చెదన్

నీ వొకమంత్రి వైనను జనింపదు నూతనతుష్టిమాకు, రాఁ
బోవదు నీకుసైతము ప్రభుత్వముదక్కినఁ గ్రొత్తపొం; గహా!
లేవు భవన్నిఘంటువున లెంకయు ఱేఁ డను రెండుమాట, లీ
పావనజీవనమ్ము సిగబంతిగదా జగదాప్తకోటికిన్

రామకథకు నిగ్గు రా భాష్యమును దీర్చు
చంద్రమౌళి! నీకు జయము! జయము!
సచివబుద్ధి కింత సారస్వతప్రీతి
కుదిరినపుడ పుడమి కొదవు లగ్గు

౭-౧-౫౫

---

* ఉప్పుసత్యాగ్రహమునాటి

# అంటరానివారా?

అంటరానట్టివా రని యాడరాని
వా రనియు నుందురా నరుల్ వసుధలోన
నిల్చునా సభలం దిట్టి నిర్ణయమ్ము
గెల్చునా తమ్ములం ద్రోయు కృపణబుద్ధి
సోదరుల మాలలను దయాశూన్యవృత్తి
నణఁగఁద్రొక్కుట పాడిగాదయ్య! మనకు
నరయ మన మెల్లరము వేల్పుననుఁగుబిడ్డ
లముగదా! మన కిన్ని భేదములు తగునె
మనము మనవారి ని ట్లవమానపఱిచి
గట్టి బానిసపుంద్రాళ్ళఁ గట్టివైచి
దొరలతోడ స్వరాజ్యమ్ముకొఱకుఁ బోరఁ
దలఁపు లీడేరునా యెన్నితరము లైన
'నాత్మవ త్సర్వభూతాని' యన్న పరమ
ధర్మసూత్రంబునం గల మర్మ మేమి
యేల పెడదారిపట్టెద రింకనైనఁ
దెలివి తెచ్చుకొనుండు సందియము లుడిగి
యజ్ఞతను దూల్చు గాంధిమహాత్ముపల్కు
మస్తమునఁ దాల్పుఁ డమ్లానమాలవోలె
దాస్యమును బాయుఁ డుత్తమోత్తములు కండు
పుణ్యరతులార! భారతపుత్రులార! (౩౦-౧౧-౨౧)

## ఆంధ్రనాయకుఁడు

ఎవఁడురవాఁడు* తెల్గులకు నింతయుఁ గట్టుపా లేదటంచు వా
రవగుణులంచు నొక్కదొరయాజ్ఞకు లోఁబడి మేలికార్యముల్
తవిలి యొనర్పరంచు నొక తత్త్వవిదుంబలె సంప్రపూరుష
శ్రవణ విదారకమ్ముల నసత్యములన్ సభలందుఁ గూసెడిన్

పందలమాటకున్ విలువపట్టునె సాహసమూర్తు లాంధ్రు ల
స్పందపరాక్రమక్రమవిశారదులై మొనమొన్నదాఁక మ
ధ్యందినభానుమండలవిధమ్మున వెల్గిరి దక్షిణాపథం
బుం దమబాహువప్రమునఁ బ్రోచిరి మోచిరి కీర్తిభారముల్

చావున కెన్నఁడున్ మదిని జంకరు యాచకదైన్యభారమున్
మోవఁగలేరు నీచులకు మ్రొక్కరు చిక్కరు నిత్యకౌతుక
శ్రీవిభవాభిరాములు విశిష్టయశోభిరతుల్ స్వతంత్రతా
సేవకె ధారవోయుదురు జీవధనంబుల నాంధ్రసోదరుల్

ఆఁడుది తెల్గుజాతిది యొయారము లూరెడిజవ్వనంబుతోఁ
గూడి సమస్తభోగములకున్ గుదురైనది సంగరమ్ములో
నోడిన జీవితేశ్వరునియుల్లము గాయముచేసి వెండియున్
వేఁడిమిదెచ్చి మెచ్చి రణవీథికి నాథుని సాగనంపదే

* ఆనాంధ్రనాయకుఁ డొకఁ డీ నిందగావించె

బెబ్బులికన్నఁదా తెలుఁగుబిడ్డ మగంటిమి మొన్న సైతమున్
బొబ్బిలికోటలో నుబికి పొంగి పరాసుల ముంచిముంచి త
న్బొబ్బనరించి శాత్రవులబిట్టుపొగడ్తలఁ గాంచదా జగం
బబ్బురమంద నాఁచికొనదా శరదిందువికాసకీర్తులన్

శ్రుతులన్ బ్రోలిచి ధర్మమర్మములు సంశోధించి బోధించి గా
ఢ తపశ్చర్యల ముజ్జగమ్ము వడఁకాడంజేసి నానాధ్వర
వ్రతులై పొల్చుటగాక ఘోరకదనవ్యాపారపాకీణులై
నుతికిం జాలిన భూసురుల్లలరె తెన్గుంగడ్డ వర్జించినన్

చాలినజాతిరా ! తెలుఁగుజాతి నిరంకుశవీరజాతిగా
నేలినజాతిరా విధిసహింపనిదై పెడచూపుఁజూచుటన్
గూలెఁ దెనుంగుఱేఁడు తలికోటరణమ్మున; నాఁటినుండి యీ
నేలకుఁ దగ్గ వాఁడిగల నేత లభింపఁ డిఁ కేమి సెప్పుదున్

కమ్మనిమాట లాడి నయగారము సూపినమాత్రఁ జచ్చు పె
ద్దమ్మలనాయకత్వ మిసుమంతయు నోర్వఁడు తెల్గుబిడ్డ; శౌ
ర్యమ్మున కంచితాశయపరంపరకున్ గుదురైన జేనికై
క్రమ్మరుచుండె వాఁ, డతనికోరిక లెన్నఁటికిన్ ఫలించునో!

౨౩-౫-౩౮



# హెచ్చరిక

దేశహితైక కార్యముల దీక్షవహించినవాఁడ, నెన్నఁడో
యాశలు త్రెంచినాఁడఁ, దను వర్ధము చంచల మంచు ధార్మికా
వేశము గొల్పుచున్ బ్రజలవిత్తము సల్లస లాగి దాని మాం
సాశనవృత్తి స్వార్థమునకై దిగమ్రింగెద వేల సోదరా!

మాలల నంటరాదు కనుమాలపుజాతి యటంచు వారి నీ
లీల బహిష్కరించి మతిలేక "దురాత్ములు దక్షిణాఫ్రికా
నేలెడివారు హైందవుల నెంతయు నీచులఁగా గణింతు" రం
చేల విచారమందెద విసీ! నిను నే మనువాఁడ సోదరా!

నీతిని జాతినిన్ మఱచి నీ వణుమాత్రయు సిగ్గులేక ప్ర
ఖ్యాతి నడంచి బుద్ధిబల కాయబలమ్ముల రూపుమాపి నీ
చేతికిఁ జిప్పనిచ్చు మధుసేవను లోపడి రచ్చలందు మా
తాతలు సోమపీథులని దర్పము లాడెద వేల సోదరా!

కూడు రవంతలేక మదిఁగుందుచు "బాబయ దండ" మంచు నీ
తోడినరుండు వెంటఁబడి దోసిలియొగ్గి నుతింప వాని పెన్
గోడు నొకింతఁ జూడ కెదఁ గొంకక జంకక పానశాలలో
మాడలఁ బాడుచేసె దిది మానవధర్మ మటయ్య సోదరా!

౧౦–౧౧–౨౭



# అన్వేషణము

అకలంకాత్మలమై నిశీథమున నిద్రావస్థలో నున్న మ
మ్మొక గీతమ్మును బాడి మేల్కొలిపి యెందున్నాఁడవో కాని కం
టికిఁ గానంబడ వింతవింత కలదా? నీకేల యీపంత మీ
సకియల్ కుందిననాఁడు నీకు ముదముల్ సంధిల్లునా? మాధవా!

పట్టితి మెట్టకేలకుఁ దపస్వులు యోగులు నెన్నినాళ్ళకున్
బట్టఁగలేని నీ విమలపాదయుగమ్మును; దీనికిం బతుల్
కొట్టినఁ దిట్టినన్ వెనుకకున్ జనఁజాలము తేటికొమ్మ లె
ప్పట్టుననైన వీడునొకొ పంకజగర్భమరందమాధురుల్

కాళిందీతటినీజలమ్మున మముం గాసింపఁగా మున్నితో
లీలన్ దూఱితివో నికుంజములలో లేకున్నఁ బున్నాగస
త్సాలాగ్రమ్మున డాఁగితో వలవదీచందంబు చాలుం బ్రభూ!
జాలం బేటికి రమ్ము రమ్ము మురళీసంగీతముల్ గుల్కఁగన్

నిక్కి గళమ్ము సాఁచి ప్రజ నిద్దురకుం జెడి దద్దరిల్లఁగాఁ
"గొక్కొరొకో"యటంచుఁ దొలికోడి చిటుక్కునఁ గూసెనింక నీ
టక్కరిచేఁత లేటి కకటా! మగవారలు మందఁ జేరఁగాఁ
బ్రక్కలనుండి లేచెదరు భంగము గూర్పకురా దయాకరా!

౧-౧౦-౨౫



# శభక్తుఁడు

మచ్చు యొకింతలేని ఋజుమార్గము నీది, వరాలు వేలువే
లిచ్చెడువృత్తి దేశహిత మెంచి త్యజించినమేటి వీవు నీ
పచ్చనిపంటగాఁ దెలుఁగుబంటులు లక్షలులక్షలై జగం
బచ్చెరువందఁ గాంగ్రెసుమహారథ చోదకులైరి ధీనిధీ!

నీ వాంధ్రోద్యమ జీవదాతవుకదా! నిద్రాణమై దీనమై
చేవంబాసిన తెల్గుజాతి వికసించెన్ నీప్రభావమ్మునన్
నీవృన్మండలినెల్ల వెల్లిగొనుచున్ నిండారె నంధ్రక్షమా
దేవీకీర్తులు నీసపర్యకతనన్ దివ్యాపగావేణికల్

గండరగండవై భరతఖండ సముద్ధర ణైకదీక్షలోఁ
బండితి వీవు గాంధిగురుపాదు లొసంగు శుభాశిషమ్ములన్
నిండితి వీవు బొంకు నవినీతి నధర్మము నూఁచముట్టుగాఁ
జెండితి వీవు కొండకులసింధుమహోదయ! వెంకటప్పయా!

ఎనుబదియేండ్లు నిండి యొడ లిట్లు కృశించిన నేమి నేఁటికిన్
రణరణితమ్ము విన్న నపరాజితవిక్రమమున్ వెలార్తు వీ
మనుగడ సాగి సాగి శతమానము నందునటుల్ నినున్ జగ
జ్జనకుఁ డనుగ్రహించు గుణసాగర! త్యాగరమా ధురంధరా!

౧౨-౧-౪౮



# తెలుఁగు పెండ్లి

కట్నములు లేని పెండ్లి బాకాలదండు
సందడులు లేని పెండ్లియు జరుగుఁగాక!
పద్యములు లేని సాహితీప్రభలు లేని
పెండ్లి గా దాంధ్రభూమిలోఁ బేదకైన

ఈ కవితానురాగ మెటు లేర్పడెనో పలుచోట్లవారికీ
పోకడ లేదు సత్కళలపొత్తునెడన్ రతిలేదు భూములున్
రూకలు గానివన్నియు విరోధులు వారికి – వీరి ప్రాక్తన
శ్రీ కుసుమించెఁ గానఁ గుదిరెన్ మధురాశయ మివ్విధమ్మునన్

నవతాప్రీతి నితాంత మాట నిట నేనాఁ డెవ్వరో పల్కిన
ట్టి వచస్సుల్ వినిపించువైదికునికంటెన్ బ్రాఢిమైఁ గొత్తక్రొ
త్త విధానన్ గృతిసృష్టిసేయు కవిమూర్ధన్యుండు సంభావ్యుఁ – డీ
యవనిం బుట్టినవారి మెచ్చెద మృదువ్యాహార ధారాగతిన్

చలిదిక్రైతలతో బట్టుసరణితోడ
గజ్జెకట్టెడి కవులునుం గలరు మనకు
నెంత మొగమోట యున్న సాహిత్యమర్మ
రసికు లీసీమవా రౌట రక్తిసెడదు

౫-౫-౫౮



# ఉపద

**జయ!** జయ! లక్ష్మికాంతకవిసత్తమ పింగళివంశవర్ధనా!
**జయ!** జయ! వేంకటేశకవిచంద్రమ కాటురివంశమండనా!
నయనమహస్సుగాఁ దెనుఁగునాఁడు సమస్తము నేఁడు మీదు హృ
దయమును గాంచి ధన్యతకుఁ దావలమయ్యె రసప్రశస్తమున్

వాగపరావతార మన వచ్చినవెంకన పల్కుఁ దేనియల్
వాఁగులు వాఁగులై తెలుఁగువాడల సాగిననాఁడు పుణ్యపుం
దీఁగలు మీవి పూచినవి దివ్య దఖండ కవిత్వభావ నో
ద్వేగము నిండి వాఙ్మయసవిత్రికి మీ రుడిగమ్ము సల్పఁగన్

వందలు వేలుగాఁ గృతులు వ్రాయరు మీ రటులైన నేమి మీ
సౌందరనంద మొక్కటియ చాలును జాతికి నెల్లకాలమున్
విందులు సేయ ధర్మపదవీ నదవీయసియైన బుద్ధి నీ
యం దురితమ్ముఁ ద్రోయ సకలాధిలతల్ మొదలంటఁ గోయఁగన్

మఱచిన బుద్ధగౌతముని మాటలు బాటలు, కంటిముందటన్
జరిగిన బాపుజీబ్రదుకుచందము లందము లొక్కటౌపునన్
మెఱయునటుల్ మహామతులు మీ రొనరించినసృష్టిలో వినూ
త్న రుచినిధానమై యొక సనాతనధర్మము గోచరంబగున్
౧-౧-౫౫ (కావలి సమ్మానము)



# ఆతఁడు

ఆతఁ డుగ్రతపః కృశీభూతుఁ డాఁత
డున్నత శరీరయష్టిసంపన్నుఁ డాతఁ
డాత్మసందర్శ నోజ్జ్వల దక్షియుగళుఁ
డాతఁ డార్ష మహాస్సున కానవాలు

అతఁడు నేర్వనివిద్య లే దతని కగ్గ
పడని భాషయు లేదు ప్రాక్పశ్చిమ ప్ర
పంచసంస్కృతి పుక్కిటఁబట్టె నతఁడు
నిఖిల మానవతా ప్రతినిధి యతండు

దుర్భ రావేశమునఁ దప్పుత్రోవఁబట్టు
దేశభక్తిని గాంధేయదిశకు మలఁచి
సత్యసంసక్తమై నహింసాప్రవృత్తి
మై గరిష్ఠతఁ గను కర్మయోగి యతఁడు

జగతి యింద్రియసుఖ లాలసతకు లోఁగి
కామ్యకర్మానుగతికమై కదలువేళ
నిత్య నిరవద్య నిగ్రహనిష్ఠ కండ
దండమై నిల్చు నూర్ధ్వరేతస్కుఁ డతఁడు

పరమగుహ్యమ్ము గీతా నిబంధితమ్ము
బ్రహ్మవిద్యను బసులకాపరికి సైత
మెఱుకపడునట్లుగా నింత లింత లైన
కథలుగాఁ బ్రవచించిన బుధుఁ డతండు

వ్యక్తిసత్యాగ్రహ ప్రధనాంగణమున
నిలువఁజాలిన మొదటిసైనికుఁడుగా మ
హాత్ములల్లము లోఁగొన్న యనఘుఁ డతఁడు
వీరులకు వింతగొల్పిన వీరుఁ డతఁడు

ఒక మహాశాస్త్రమర్యాద నొంది వెలసె
నతఁడు చేపట్టినంతన యలఁతికదురు
ఒక మహావేదబుక్కు వానికిఁ గరంగి
చల్లచల్లని దేశమై వెల్లివిరిసె

కుత్తుకలు గోసి నెత్తురుకూడు గాదు
తృష్ణలను ద్రుంచి యమృత మందించు నతఁడు
విప్లవముకాదు వానిది విశ్వశాంతి
కాదరువుగా నెసంగు సర్వోదయంబు

జనచయమ్ములు దేవతాగణము లయ్యొ
దాత లెల్లరు హోతలై తరలివచ్చి
రుభయతారక మగుశాంతి యురలి పొరలె
నతఁడు భూదానయజ్ఞ దీక్షితుఁడు కాఁగ

కలిమి నిచ్చిరి ముక్కారుపొలము నిచ్చి
రొడలి నిచ్చిరి బ్రదు కిచ్చి రోటలేక
బాపురే! వానిపయనించు బాటలందు
నిండె నీవులు పుణ్యముల్ పండిపోయె

కానరాఁ డేఁక బాపుజీ కనుల కనుచు
శోకమయమూర్తియై క్రుంగు లోకమునకుఁ
బట్టుఁగొమ్మగ నిల్చినయట్టి దీన
బాంధవుఁడు పావనుఁడు 'వినోబా' యతండు

కోటి కొకఁడేని వానికి దీటువచ్చు
పురుషుఁ డుండినమహికి రాచటిక మేల
శాసనము లేల యస్త్రశస్త్రమ్ము లేల
ధర్మదేవత నాల్గుపాదముల నడువ

౫-౨-౫౫



# జయ సంక్రాంతి

(గేయము)

జయ! జయ! జయసంక్రాంతీ!
జగ దాహిత సుఖశాంతీ!
జయ! మహాంధ్ర సదన సదన
సంవర్ధిత నవ్యకాంతి!

యుగ యుగములనుండియు నీ
యుదయము మా కానందమె
అగును గాని యిప్పటి నీ
యందము పరమానందము

మా పెంచిన యీరసముల
మాతగుండె నారసముల
నీపుట్టువు పెకలించెను
తాపాలను వదలించెను

సీమలు తెచ్చిన కయ్యము
చెటిచెను మా నెటి నెయ్యము
నీముందట నిలువలేక
నీల్గిన ధా పెనుదయ్యము

పోరు నష్టి పొందు పుష్టి
కారణ మను దీర్ఘదృష్టి
నీ రాకడతోడ మాకు
నివ్వటిల్లె నిదేతుష్టి

వాఁకలతో వఱదలతో
నేకమై త్రివేణి కదలె
మా కెదురై గెలువ నేర్చు
మగ లెవ రీజగమం దిఁక

గాంధేయుఁడు శ్రీరాములు
కరుణించిన దీ రాష్ట్రము
గాంధేయ పథమ్మునందె
గడియించు నఖండజయము

మా కవచము సత్యదీక్ష
మా కస్త్రం బగు నహింస
మా కామ్యము మాగమ్యము
చీఁకు చింత లేని క్రాంతి

౧౦-౧-౫౫

## మా పద్యకృతులు

| | |
|---|---|
| బాపూజీ - ఆత్మకథ | |
| మేలి క్యాలికో | ౧౦- ౦-౦ |
| సాదా క్యాలికో | ౮- ౦-౦ |
| పఱిగపంట (ఖండకావ్యములు) | ౨-౧౨-౦ |
| శబల ,, | ౧- ౪-౦ |
| ఆత్మార్పణము | ౧- ౦-౦ |
| ఉదయగానము | ౧- ౪-౦ |
| రాష్ట్రగానము (అచ్చులో) | |
| ధర్మజ్యోతి ,, | |


తుమ్మల సీతారామమూర్తిచౌదరి

బోర్డుహైస్కూలు పండితుఁడు - అప్పికట్ల

(వయా) బాపట్ల (గుంటూరుజిల్లా)



భారతీ ప్రెస్, తెనాలి.

